The Hindu - August 4, 1957,
Sunday Supplement - Page III.
Books in Brief : (Telugu)

## Bharata Tattva Sastra Parisilanamu

**By Tripuraneni Venkateswara Rao**

(Navodaya Publishers)

The book under notice attempts to examine the philosophical thought of Ancient India upto the time of Sri Samkara. The latest literature on the subject such as the works of Dr. S. Radha Krishnan and other scholars, have been consulted and indeed even criticised. Especially noteworthy is the examination of the claim that Indian Philosophy is different from the Western. The author shows a grasp of the essential features of the Indian systems of thought. His knowledge of Western Philosophers has also been of great help. The reinterpretation of History and Philosophy by Marxists has had the effect of kindling interest in the shape and movement of Indian Philosophical movements. The book is well worth serious study by students who would like to know something of the thought of India, though they would be encouraged to go deeper to the original works of the ancients for a real insight into their ideas.

K. C. VARADACHARI
Professor of Philosophy & Comparative Religion.
President, All India Philosophical Congress.

కృష్ణా పత్రిక
జూన్ 14, 1958.

## శంకరాద్వైత సమీక్ష

మార్క్సిస్టు సిద్ధాంత రాజకీయ మాసపత్రిక అయిన 'సందేశం' పక్షాన 'తాత్త్వికైతిహాసికాధ్యయనోప సంఘం' పెద్దాపురంలో అద్వైత సిద్ధాంత సమీక్షకై ఒక గోష్ఠిని ఏర్పాటుచేసింది. ఆ గోష్ఠికి చేరిన వ్యాసముల సంపుటియే యీ సంచిక.

ఇందు మొత్తము తొమ్మిది వ్యాసములున్నవి. వానిలో విద్యాశంకర భారతీస్వామి (బందరు గాయత్రి పీఠాధిపతులు)వారి "జగజ్జీవేశ్వరుల తత్త్వము - అద్వైతము"; డాక్టరు శ్రీ కుప్పా వెంకటరామశాస్త్రిగారి 'శంకరుని మాయావాదం', శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారి "శంకరాద్వైతం", శ్రీ పాదలక్ష్మీనరసింహం ఎం.ఏ బి.ఎల్. గారి 'అద్వైతంలో కొన్ని తాత్త్విక దోషములు - ఒక సమీక్ష' అను

వ్యాసములు విషయ ప్రధానములు. ఏటుకూరి బలరామమూర్తిగారి 'అద్వైత భావ వాదం – ఒక విమర్శ' అను వ్యాసము 'శంకరాద్వైతం' అను వ్యాసములో గతార్థమగుచున్నది.

అద్వైత సిద్ధాంతమును సలభముగను సమగ్రముగను సంప్రదాయసిద్ధముగను స్వప్రమాణముగను తెలిసికొనుట కుపకరించునది శ్రీ విద్యాశంకర భారతీస్వాముల వ్యాసమొకటియే.... ఈ సంచికలోని యితర వ్యాసములను తాము వ్యాసము వ్రాయక ముందు చూడకుండుటచే కాబోలు, వానిలోని అద్వైత విమర్శలకు వీరు సమాధానమీయలేదు. ఇకనైనను వారాపనికి పూనుకొందురని యాశించుచున్నాను.

శ్రీ త్రిపురనేని వెంకటేశ్వరరావుగారి 'శంకర్వాద్వైతము' అనే వ్యాసం అవశ్యపఠనీయం. వీరి వాదాలు అప్రతి సమాధేయములు కాకున్నా, వీరు శ్రీ శంకరాద్వైత సిద్ధాంత విషయములన్నిటిని విమర్శించుటకు తీవ్రముగా కృషిచేసినారు. భాష్యములను విమర్శనాదృష్టితో చదివినారు. మొదటి పర్యాయము వీరి వ్యాసము చదివినప్పుడు సామాన్యముగ వీరి వాదములన్నియు సమంజసములేయను నూహ పాఠకులకు తప్పక కలుగును...వీరిభాష్య పరిశ్రమ మాత్రము పాఠకుల నాశ్చర్యాంకితులనుచేయును. వీరు మొదట 'గౌడపాదుడు–అద్వైతం' అను విషయమును వివరించినారు, అందులో అపరోక్షానుభవానికి, వేదప్రమాణానికి సంబంధించిన విషయము శ్రద్ధగా పరిశీలించినచో కొంత సవరణ సపేక్షించునని పాఠకులకు తెలియును. కాని గౌడపాదుని నిశిష్టతను వీరు బాగుగా నిరూపించినారు. వీరి మతములో గౌడపాదుని సిద్ధాంతమువేరు, బాదరాయణునిదివేరు దీనికి విప్రతిపత్తిలేదు. ఆటుతరువాత ఆత్మ – పరమాత్మ – చైతన్యం అను శీర్షికక్రింద అద్వైత స్వరూపమును ప్రతిపాదించినారు. అద్వైతమున కాయువుపట్టయిన నిద్రనుగూర్చి వివరించినారు. దీనిపై విమర్శలో శరీరశాస్త్ర సిద్ధాంతముల సాహాయ్యముచేసికొని అద్వైత సిద్ధాంతమును తప్పన్నారు. "నిద్రలో బహిరంతరాలు రెండూ ఉన్నాయి. వ్యక్తిగతమైనజ్ఞాత–జ్ఞాతచే తెల్సుకోబడే బాహ్యజగత్తూ విడదీయరాకుండా పెనవడియున్నాయి. అంటే వైయక్తికమైన జ్ఞాత, జగత్తూ రెండూ సత్యాలే"

ఇక అధ్యాసవాద విమర్శలో అధ్యాస లక్షణము కుదురదన్నారు. అందుకిచ్చిన దృష్టాంతాలు సరిపోవన్నారు. దృష్టాంతాలు అన్ని అంశాలలోను సరిపోవాలని వీరివాదన – గౌడపాదులు ప్రతిపక్షమువారిని దృష్టాంతము చూపుమని అడిగి, తన సిద్ధాంతానికి దృష్టాంతము చూపలేకపోవుట దోషమన్నారు. అట్లా ఎందుకు అనవలసి వచ్చినదో అచటి వ్యాఖ్యాతలు వివరించినారు. ఈ విధముగనే మాయావాదము నిలువదని నిరూపించుటకు యత్నించినారు. విజ్ఞానశాస్త్ర సాపేక్ష సిద్ధాంతమునకును అద్వైతమునకును సంబంధములేదని నిరూపించినారు. ఇట్లువీరు శంకరాద్వైతమును అడుగడుగునా ఖండించినారు.

–భాగవతుల కుటుంబరావు



రచయిత : త్రిపురనేని వెంకటేశ్వరరావు

జననం : 14 డిసెంబరు, 1929 అంగలూరు, కృష్ణాజిల్లా.

చదువు : గుడివాడ హైస్కూలు, బందరు హిందూ కళాశాల,
విజయనగరం మహారాజా కళాశాల – బి. యస్‌సి.

జీవితం : కళాశాల నుండి అజ్ఞాతవాసం (1950 – 51).
1953 – టెక్కలి ధాన్యశిస్తు జమీందారీ రైతాంగ
సత్యాగ్రహ విజయ సారథ్యం.
1957 వరకు శ్రీకాకుళంజిల్లా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి,
1959 నుండి రాజకీయాలు విరమించి వ్యాపారం,
సాంఘికసంస్కరణ – హేతువాదం – మానవతాదృష్టి.

రచనలు : జహనారా, మాంచాల, బాలచంద్రుడు.
(అముద్రిత కావ్యాలు – అగ్నిదగ్ధాలు) 1945–48

ముద్రితాలు : భారత తత్త్వశాస్త్ర పరిశీలన 1956
శంకరాద్వైతం 1958

అముద్రితాలు : కలౌవేంకటనాయకః (ఖండకావ్యం) 1964
రామాయణఖండకృతి 1965
గీతాంజలి (పద్యానువాదం) 1966
నాగార్జునుడు 1975.
రేడియో ప్రసంగాలు
సాహిత్య విమర్శ – వ్యాసాలు